

తిరుమల తిరుపతి
దేవస్థానములు
తిరుపతి



# పురందరదాసు

శ్రీనివాస బాలభారతి - 62

# పురందరదాసు

రచన

**డా॥ ఎస్. గంగప్ప**

ప్రధానసంపాదకుడు

**డా॥ ఎస్.బి. రఘునాథాచార్య**




ప్రచురణ

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

**2004**

ŚRĪNIVĀSA BĀLABHĀRATI - 62
(Children Series)

**PURANDARADĀSU**

By

**Dr. S. Gangappa**

Chief-Editor:
Dr S B. Raghunathacharya

T.T.D. Religious Publications Series No.: 369

First Edition : 1993
Re-print · 2004

Copies 10,000

*Published by*
Sri Ajeya Kallam, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

Art CHAYA

*Printed at*

Sri Venugopala Offset Printers
VIJAYAWADA, PH 5511302

# ముందుమాట

మాయలు మర్మాలు తెలియక మల్లెపూవులాగ నిర్మలంగా ఉండే మనస్తత్వం బాలల్లో కనబడుతుంది. మంచి కర్పూరాన్ని మించిన ఆ మనస్సులో ఘుమఘుమలాడే చక్కని సంస్కారాలు బాల్యంలోనే ముద్రింపబడాలి అలా జరిగితే పదికాలాలపాటు భవ్యమైన జీవితాన్ని వాళ్ళు భద్రంగా గడపడానికి పునాది ఏర్పడుతుంది. అలా పెరిగిన ఆ చిన్నారులు రాబోయే తరాలకు మానవ జాతి మర్యాదలను, మహనీయతను చాటి చెప్ప గలుగుతారు. అందుకే అందాల బాలలు మనవారసత్వాన్ని, ఇతిహాస - పురాణాల్లో నిక్షిప్తమైన మానవత్వపు విలువల్ని అందించవలసిన అవసరం ఎంతైనా ఉంది

ఏ లక్ష్యంలేని జీవితం మన అలక్ష్యానికి గురైన అందమైన మొక్కలాగా నిష్ఫలంగా మోడువారిపోతుంది చిన్న పిల్లలకు లక్ష్యశుద్ధి కలిగించి వారి జీవితాలను తీర్చిదిద్దాల్సిన బాధ్యత ఎప్పుడూ పెద్దలపైనే ఉంటుంఁ మానవతకు మాన్యతను చేకూర్చిన కొందరు మహావ్యక్తుల ఆదర్శ జీవితాలను చిన్నారి బాలలకు అందించి, వాటి ద్వారా వారిలో కనువిప్పు కలిగించడానికే ఈ శ్రీనివాసబాలభారతి ఉదయించింది.

ఈ ప్రణాళికకు ప్రధాన లక్ష్యం చిన్నారి బాలబాలికలైన, కుంటుంబంలోని పెద్దలుగూడా ఇంతవరకు ప్రచురింపబడిన పుస్తకాలను ఎంతో బాగా ఆదరించి మానవతవు విలువల్లోని మాధుర్యాన్ని గ్రహిస్తున్నారని తెలుసుకోవడానికి నాకెంతో ఆనందంగా వుంది. ఇలా తిరుమల తిరుపతి దేవస్థానాల ఆశయం కొంతకు కొంత ఫలవంతమౌతున్నది.

శ్రీనివాసబాలభారతి ప్రణాళికను తయారుచేసి, బాలల కోసం రమణీయమైన రచనలను చేయించి, అందరికి అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య గారికి నా అభినందనలు. ఈ ప్రచురణలను రూపొందించడంలో సహాయాన్నందిస్తున్న రచయితలకు, కళాకారులకు నా ధన్యవాదాలు. ఈ పుస్తక ప్రతులు చెల్లిపోయినందున పునర్ముద్రిస్తున్నాం. బాలలతో పాటు అందరినీ అలరిస్తుందని మా ఆకాంక్ష.

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం!!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పినాటికే సభ్యతకు, సంస్కారానికి, నైతిక, ధార్మికాదర్శాలకు పేరు పడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతి మానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖ సంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మన మస్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి', 'ఇది తరతరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం', 'ఇది నా కర్తవ్యం' అని ప్రతి బాలుడు, బాలిక ఈ దేశసేవకు తనను అంకితం చేసుకొంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందరో మహానుభావులు మహా పురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి,

చక్కని సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవన వాహినిని మనదాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మన వెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు, మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి! వాళ్ళను అర్థం చేసుకోవడం, వాళ్ల చరిత్ర మననం చేసుకోవడం, వారి ఆదర్శాలు స్మరించడం కూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మన జాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం.

బాలలూ! రండి! రండి!
నిండు మనస్సుతో మీకిదే మా స్వాగతం!

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు

# పరిచయం

మానవజీవితం నీటిబుడగలాంటిది. ఏక్షణంలో ఏం జరుగుతుందో ఎవ్వరికి తెలియదు. కాని తను శాశ్వతంగా ఉంటాననే ప్రతివాడు ఆస్తిపాస్తుల్నీ, సిరిసంపదల్నీ ఇంకా ఇంకా సంపాదించాలని ఆరాటపడుతుంటాడు. అనిశ్చితమైన భవిష్యత్తుకోసం వర్తమానాన్ని పాడుచేసుకుంటున్నానని ఎవ్వడూ గుర్తించలేడు. అది గుర్తుకొచ్చేటప్పటికి అంతా అయిపోతుంది. అయితే కారణజన్ములైన కొందరు భగవద నుగ్రహంచేత ఆసత్యాన్ని గుర్తించి అజ్ఞానాంధకారాన్ని చీల్చుకొని అనంత తేజస్సులో ప్రవేశిస్తారు. అక్షరాలా అదే ఒక మహాలోభి జీవితంలో జరిగింది.

అయనొక కోటీశ్వరుడైన వజ్రాలవ్యాపారి. ఒకనాడు ఎవరో ఒక బీదబ్రాహ్మణుడు అతణ్ణేదో యాచించాడు. ఏదో ఇచ్చి యాచకుణ్ణి పంపేశాడతడు. కొంత సమయం గడిచింది. ఆయాచకుడు మళ్లా వచ్చి ఒక ముక్కుపుడక ఇస్తూ- "దీన్ని తీసుకొని డబ్బివ్వ" మన్నాడు. ముక్కుపుడక చూసి ఆశ్చ ర్యపడ్డాడా ధనికుడు. అది తన భార్యదే. "అలాగే ఇస్తాను.

కొంచెంసేపు ఆగ" మని ఇంటికి వెళ్లాడు. "ముక్కుపుడక ఏమైంద" ని భార్యనడిగాడు. బ్రాహ్మణుడికి దానం చేసిన సంగతి చెబితే భర్త భగ్గుమంటాడని భయపడి లోపలికి వెళ్లి విషం తాగటానికి సిద్ధపడింది ఆ ఇల్లాలు. ఆశ్చర్యం! విషపాత్రలో ముక్కుపుడక పడింది. దాన్నితీసుకొని అంగడికి వెళ్లాడు ఆ వ్యాపారి. అక్కడ తను దాచిపెట్టిన ముక్కుపుడక లేదు. ఎలా జరిగింది ఈ సంఘటన? దిగ్భ్రమ చెందాడు. ఇది భగవంతుని లీల అని గుర్తించాడు. ఆయన అనుగ్రహం ముందు ఈ సిరిసంపదలన్నీ గడ్డిపరకతో సమానమని తెలుసుకున్నాడు. ఆస్తిని అందరికీ దానంచేశాడు. మహాభక్తుడైనాడు. ఆ మహనీయుడెవరో తెలుసా? అంతవరకు నవకోటినారాయణుడని ప్రసిద్ధిపొంది కోట్లకు పడగెత్తిన శ్రీనివాసనాయకుడు: ఆ తరువాత వ్యాసరాయల శిష్యుడై పురందరవిఠలునిపై లక్షలాది పదాలను రచించి, కర్ణాటక పదకవితాపితామహుడుగా పేరుగాంచిన పురందరదాసు.

దాసకూటానికి మూలపురుషుడైన ఆయన భక్తి, విరక్తి మనకు మార్గదర్శకాలు కావాలి.

—ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య

# పురందరదాసు

## సంగీతపితామహుడు :

"దురితవ్రాతము లెల్లను
పరిమార్చెడి హరిగుణముల బాడుచు నెపుడున్
పరవశుడై వెలయు పురం
దర దాసుని మహిమములను దలచెద మదిలోన్"

(ప్రహ్లాదభక్తవిజయము)

—అని నాదోపాసనతో ముక్తిపొందిన త్యాగరాజు పురందరదాసుని పొగడినాడు. "దాసరందరే పురందర దాసరయ్యా" దాసులు అంటే పురందరదాసేనయ్యా అని తన గురువు వ్యాసరాయల పొగడ్తకు పాత్రుడైన పురందర దాసు మహాపురుషుడు. శిష్యులు గురువులను పొగడడం లోకంలో సహజం. కాని శిష్యుడు గురుస్తుతికి అర్హుడు కావటం అపురూప విషయం. కాబట్టి పురందరదాసు

మహానుభావుడు. గురువుల ప్రశంసకు పాత్రుడై, దాస కూటానికి ప్రధాన వ్యక్తిగా ఉండి, వ్యాప్తికి పాటుపడిన మహాపురుషుడు పురందరదాసు. కన్నడంలో పదరచన చేసి, సంగీతానికి స్పష్టరూపతనిచ్చే వాగ్గేయకారుల్లో ప్రముఖుడై 'కర్ణాటకసంగీతపితామహు' డనే బిరుదుతో ప్రసిద్ధికెక్కినవాడు పురందరదాసు.

## సంస్కృతి దెబ్బతిన్నది :

అనేక విధాలా విషమపరిస్థితి కొనసాగుతున్న సమయంలో జన్మించాడు పురందరదాసు. అనాడు మత సంబంధమైన వైరుధ్యాలు ఎక్కువగా ఉండేవి. ప్రజలందరు అంధకారంలో ఉన్నారని కొందరు భావించారు. తమదే సరైన మార్గమని కొందరు పట్టుపట్టారు. సాహసవంతు లైన కొందరు కొత్తదనాన్ని తీసుకురావాలని యత్నించారు. సామాన్యులు తమకు తోచిన సంప్రదాయరీతిలో నడచుకొంటూ వచ్చారు. వీటిని మించి సత్యం ఒక్కటే

నిలుస్తుందని కొద్దిమంది మాత్రమే గ్రహించగలిగారు. మహమ్మదీయుల పాలనలో భారతీయ సంస్కృతికి ముప్పు ఏర్పడింది. మహమ్మదీయ మతసంబంధమైన భావాలు, నమ్మకాలు మొ॥ వాటివల్ల హిందూమతము, సంస్కృతి ఛిన్నాభిన్నమయ్యేదశ కలిగింది. అలాంటి పరిస్థితులను ఎదుర్కోటానికి బసవేశ్వరుడు జన్మించి వీర శైవ మతం స్థాపించాడు. మన హైందవమతాన్ని రక్షించ డానికి బసవేశ్వరునితో పాటు వచనకారులు ప్రయత్నించి సఫలులయ్యారు.

## వికసించిన వైష్ణవధర్మం:

ఇదే సందర్భంలో విద్యారణ్యుని అనుగ్రహంతో హరిహరరాయలు, బుక్కరాయలు విజయనగర సామ్రా జ్యాన్ని స్థాపించారు, హైందవమతం, నాగరికత, సంస్కృతి మొదలైన వాటి పరిరక్షణకు దక్షిణాపథంలో ఈ విజయనగరం కంకణం కట్టుకుంది. క్రమంగా ప్రౌఢదేవ రాయలు, కృష్ణదేవరాయలు రాజ్యపాలనాకాలంలో వైష్ణవ

మతప్రాధాన్యం హెచ్చింది. విజయనగర పతాకం నీడలో దక్షిణాపథమంతా సుభిక్షంగా ఉండగా, ఎందరో మహాను భావులు హైందవ సమైక్యంకోసం, మతపునరుజ్జీవనం కోసం పాటుపడినట్లు తెలుస్తుంది. అంతే అంతకుముందు రెండు మూడు శతాబ్దాల క్రితం బసవేశ్వరుని ఆధిపత్యంలో వీరశైవం వీరవిహారం చేసినచోటే మళ్లీ వైష్ణవమతం ప్రాధాన్యం వహించింది. దీనికంతటికి కారకులు, ప్రేర కులు వ్యాసరాయలు, పురందరదాసు అనడం సముచితం.

## వారిలో ఒకడు కావాలి :

కృష్ణా తుంగభద్రల మధ్యప్రదేశంలో ఎంతోమంది మహానుభావులు, అవధూతలు జన్మించారు. భగవంతు డొక్కడే అని, ముక్తికి మార్గం భక్తి అనీ, సర్వమానవ సౌభ్రాతృత్వం అవసరమనీ వారు బోధించారు. అధ్యాత్మిక మైన అవగాహనకోసం అంతఃప్రేరణవల్ల సామాజిక, మతసంబంధమైన ఉద్యమాలు ఏర్పడ్డాయి. ప్రాచీన

భారతీయ సంస్కృతిని పునరుద్ధరించి అవి బంగారు భవిష్యత్తుకు బాటలు వేశాయి. నాయకులులేని ప్రజలులేరు. అయితే ప్రజలమనోభావాన్ని గ్రహించి వారిలో ఒకడుగా ఉండి నడిపించినవాడే నిజమైన నాయకుడు. అలాంటి సందర్భంలో పురందరదాసు జన్మించాడు.

## శ్రీనివాసుడు పురందరుడైనాడు :

పురందరదాసు అసలు పేరు అదికాదు. ఇతనికి ఎక్కువ పేర్లు ఉన్నట్లు తెలుస్తుంది. శ్రీనివాసనాయక లేక శీనప్ప; తిరుమలరాయప్ప, తిమ్మప్ప, కృష్ణనాయక, పురందరవిఠల-అనేపేర్లు ఉండేవి. కాని వరదప్పనాయక పుత్రుడు శ్రీనివాసనాయక అన్నదే చాల ప్రసిద్ధమైన పేరు. శ్రీనివాసనాయకుడు సర్వసంపదల్ని వదలిపెట్టి నిరుపేదతనాన్ని వరించాడు. భగవంతుని నామస్మరణ చేస్తూ వ్యాసరాయలను ఆశ్రయించాడు. వ్యాసరాయల ఉపదేశం పొంది "పురందరవిఠల' అనే ముద్రతో పదరచన చేయ

నారంభించడం వల్ల పురందరదాసు అనేపేరు సార్థక మైంది. అప్పటినుంచి పురందరదాసు కన్నడభాషలో ఉత్తమ వాగ్గేయకారుడిగా ప్రసిద్ధికెక్కాడు.

## పురందరపల్లెలో....

శ్రీనివాసుని స్వగ్రామం పురందరఘడమని కొందరి అభిప్రాయము. ఇది పూనా సమీపంలో ఉంది. ఈ నాడు ఇది మహారాష్ట్రలో ఉన్నా, పూర్వం కర్ణాటరాజుల పాలనలోనే ఉంది. ఆ ప్రాంతంలో ఆనాడు చాలవరకు కన్నడమే వాడుకభాష. ఇది ఆనాడు వజ్రాలవ్యాపార కేంద్రంగా గూడా ఉండేదని అంటారు. ఆ పట్టణంలో శ్రీనివాసనాయకుని తండ్రి పేరు మోసిన వజ్రాలవ్యాపారి కొందరు చారిత్రకుల అభిప్రాయం ప్రకారం శ్రీనివాస నాయకుని ఊరు పురందరఘడ లేక పురందరాలయం లేక పాకశాసనపురమని తలంచబడింది. ఇది కొన్ని ఆధారాలతో శివమొగ్గ జిల్లాలోని తీర్థహళ్లి తాలూకాలోని

"పురందర" అనే పల్లె అని నిర్ణయించడం జరిగింది. ఆ కాలంలో అది ప్రఖ్యాత వాణిజ్య కేంద్రం. నాయక అనే పేర్లతో బ్రాహ్మణకుటుంబాలు ఉండేవి. అనాడు విద్యా వంతులకు, భక్తులకు, మేధావులకు అది నిలయం. పాండురంగని భక్తి ప్రచారమూ ఉండేది. ఇది పశ్చిమాన గల ఉడిపికి, ఈశాన్యదిక్కులోని పండరీపురానికి నడుమ ఉన్న స్థలం. శ్రీనివాసనాయకునికి వ్యాపారం వల్ల బిజాపురం, సొల్లాపురం, పురందరపురం, హంపి మొదలైన నగరాలతో సంబంధం ఉండేది. ఆవెనుక పండరీపురం, హంపి నగరాల్లోనే ఎక్కువ కాలం నివసించినట్లు తెలుస్తుంది.

## అన్నమాచార్యులతో పురందరదాసు :

పురందరదాసు జీవితకాలం 1484-1564 అని పలువురు కర్ణాటక విద్వాంసుల అభిప్రాయం. సుమారు 40 సంవత్సరాల వయస్సులో శ్రీనివాసనాయకుడు వ్యాస రాయలను సందర్శించి వారి ఉపదేశం పొంది పురందర

దాసుగా మారిపోయినట్టు తెలుస్తుంది. శ్రీనివాసనాయకుని జననకాలం మరికొందరి ప్రకారం 1480. ఇది కూడా సరి కాకపోవచ్చు. కారణం ఏమంటే పురందరదాసు తిరుపతిలో అప్పటికే తెలుగులో ప్రసిద్ధ వాగ్గేయకారుడై, సంకీర్తనా చార్యుడనీ, పదకవితాపితామహుడనీ బిరుదులు పొందిన అన్నమాచార్యుని సందర్శించినట్లు ఒక నిదర్శనముంది.

"తనరు పురందర దాసాహ్వయుండు
పరమ భాగవతుడై పరుగుచు నంద
వర కులాగ్ర గణియైన వైష్ణవోత్తముడు
.... .... .... .... .... ....
.... .... తాళ్లపాకకాసనుడన్నమయ్య
వెన్నునిగానె భావించి కీర్తించి
సన్నుతి సేయ నాచార్య వర్యుండు
నతని విఠ్ఠలునిగా ననయంబు దలచి
ప్రతిలేని గతుల సంభావించెనపుడు"

అని అన్నమాచార్యుని ( 1424-1503 ) జీవిత చరిత్ర రచించిన ఆగని మనుమడు చిన్నన్న ( 1500-1558 ) మాటల వల్ల మనకీ విషయం తెలుస్తూంది. పురందరదాసు అన్నమాచార్యుని చరమదశలో దర్శించినాడన్నది ముఖ్య విషయం. సర్వసంపదల్నీ వదలుకొని భికారియై సకుటుంబంగా విజయనగరం వెళ్ళి వ్యాసరాయల దగ్గర ఉపదేశం పొందాడు. ఆవెనుక తిరుపతిలో అన్నమాచార్యుని దర్శించే సమయానికి అంతే పురందరదాసు వయస్సు సుమారు 30 ఏండ్లు దాటి ఉంటాయి. తన తాత చరిత్రని రచించిన చిన్నన్న మాటలను మనం విశ్వసిస్తే పురందరదాసు జననం 1470, మరణం 1564.

## అన్ని విద్యలలో ఆరితేరాడు :

వరదప్పనాయకునకు కమలాంబకు 1470లో అపురూపంగా పుత్రజననం అయింది. అతనికి తల్లిదండ్రులు 'శ్రీనివాసనాయక' అని నామకరణం చేశారు. వరదప్ప నాయకుడు మధ్వబ్రాహ్మణుడు, రత్నవ్యాపారంలో

ఆరితేరి, ఎక్కువ ధనమార్జించిన సంపన్నుడు. సంప్రదాయ పద్ధతిలో తగిన వయసురాగానే పుత్రునికి ఉపనయనం గావించి, విద్యాభ్యాసం చేయించారు. తాను సంపన్నుడు కావటంవల్ల దేనికీ లోటులేదు. చక్కగా సంస్కృత కర్ణాటభాషల్లో పండితుణ్ణి చేయించారు. గానాభిరుచిని గుర్తించి తగుమాత్రం సంగీతంలోనూ శిక్షణ ఇప్పించారు. ధార్మికవిద్యలో కూడా శాస్త్రాభ్యాసం చేయించారు. దీనికి తోడు తనవృత్తి రత్నవ్యాపారం కావడంవల్ల తగిన రీతిలో రత్నపరిక్షా పద్ధతుల్ని పుత్రునికి తండ్రి నేర్పించారు. పదహారేండ్ల వయస్సువచ్చేసరికి ఈ విద్యలన్నిటిలోనూ తగిన పాండిత్యం సంపాదించారు. బాల్యంలో సంపాదించిన విద్యలన్నీ శ్రీనివాసనాయకునికి భవిష్యత్తులో మిక్కిలి ఉపకరించాయి.

## సరస్వతీబాయి సహధర్మచారిణి :

శ్రీనివాసనాయకునికి పద్దెనిమిదేండ్ల వయస్సులోనే సరస్వతీబాయితో వివాహం జరిగింది. ఆమె సంప్రదాయ

కుటుంబంలో జన్మించింది. ఆవిడ ధర్మంపై శ్రద్ధ, దైవభక్తి, పతిభక్తి, భూతదయ కలది. సరస్వతీబాయి శ్రీనివాస నాయకులది అనుకూల దాంపత్యం. సరస్వతీబాయి భర్తకు అనేక విధాలా జీవిత భాగస్వామినిగా ఉండి, అతని సుఖ సంతోషాలకు సహకరించిన సహధర్మచారిణి. ఇరవయ్యో ఏటనే తండ్రి మరణించాడు. తండ్రి సాగించిన వజ్రాల వ్యాపారమూ, ఆర్జించిన ఆస్తిపాస్తులు అన్నీ శ్రీనివాస నాయకునికి సంక్రమించాయి. క్రమంగా ఆ దంపతులకు వరదప్ప, గురురాయుడు, అభినవుడు, మధ్వపతి అనే నలుగురు పుత్రులు, రుక్మిణీబాయి అనే కూతురు జన్మించారు.

## పిల్లికి కూడా బిచ్చం పెట్టడు:

శ్రీనివాసనాయకునికి ధనసంపాదనమే ప్రధాన లక్ష్యం. కాబట్టి చిన్నప్పుడే నేర్చిన విద్యల ప్రభావం ఇతనిపై లేకుండా పోయింది. సామాన్యంగా మానవుల్లో ఉండవలసిన మానవతా దృక్పథం సైతం ఇతనిలో కొరవడింది. ధనసంపాదనలో నిమగ్నుడై సుఖాల్ని సైతం

లెక్కచేసేవాడు కాడు. వజ్రాల వ్యాపారంలో మిక్కిలి నిపుణుడు. కనుకనే అచిరకాలంలోనే కోట్లకొద్ది సంపాదించి "నవకోటి నారాయణ" అనే బిరుదును పొందినవాడు. అయితే అతడు పిల్లికి బిచ్చంపెట్టని లోభి. సంపాదన అధికమయ్యేకొద్దీ పిసినారితనం మరింత ఎక్కువైంది. ద్రవ్యలోభం అతని పుట్టుగుణం. యాచకుల్ని శత్రువులతో సమానంగా చూసేవాడు. ఎవరైనా ధర్మబోధచేస్తే మీబోధనలన్నీ డబ్బుకోసమే అనేవాడు. ఈ లోభగుణంవల్ల నాస్తికుడయ్యాడు. ఇంతటి లోభి మరెవ్వరూ లేరన్న వార్త విన్న సరస్వతీబాయి మిక్కిలి కుమిలిపోతూ ఉండేది. తాను దైవభక్తి, భూతదయగల సంప్రదాయ కుటుంబంలో జన్మించింది. కానీ భర్త దయాదాక్షిణ్యాలు లేని రాతిగుండె గలవాడు. అందుకు సరస్వతీబాయి మనోవేదనకు అంతులేదు. వజ్రాల వ్యాపారం కోసం ఎన్నోసార్లు విజయనగరం వెళ్లివస్తూ ఉండేవాడు. ఆనాడు వజ్రాల వ్యాపారంలో మాత్రం అతనిని మించిన

వాడు లేదు. అయితే [redacted] పిసినారితనం ఎన్నో ఏళ్ళు కొనసాగలేదు.

## [redacted] ముక్కుపుడక ఇస్తే చాలు:

ఇలా ఉండగా ఒక తమాషా జరిగింది. ఆ సంఘటనతో శ్రీనివాసనాయకునిలో మార్పు వచ్చింది. ఒక దినం ఒక ముదుసలి బ్రాహ్మణుడు ఒక బాలునితో పాటు వచ్చి, అతని ఉపనయనం కోసం సహాయం చేయమని శ్రీనివాసనాయకుని ప్రార్థించాడు. శ్రీనివాసనాయకునికి సంపాదనే తెలుసు, దాన్ని సద్వినియోగం చేసేతీరు ఎరుగనివాడు. ప్రతిదినమూ బ్రాహ్మణుని తరువాత రమ్మని చెబుతూ ఉండేవాడు. ఒకరోజు ఆవృద్ధబ్రాహ్మణుడు "ఏమైనా ఇస్తారో లేదో తేల్చి చెప్పండి" అని ఖచ్చితంగా అడిగాడు. అంతకంటె ఎక్కువగా విసిగిపోయిన శ్రీనివాసనాయకుడు అతన్ని వదిలించుకోవాలని తలంచాడు. వెదకి, [redacted] చెల్లని ఒకటి రెండు రూకలు ఇచ్చి

పంపాడు. ఇక ప్రయోజనం లేదని తలచిన అముదుసలి వాటిని గ్రహించి వెళ్ళిపోయాడు. అపుడేమి చేశాడో తెలుసా? తిన్నగా శ్రీనివాసనాయకుని ఇంటికివెళ్ళి దానం చేయవలసిందని శ్రీమతి సరస్వతీబాయిని ప్రార్థించాడు. "స్వామీ నావద్ద సొంత డబ్బు ఏమీలేదే" అన్నది బాధపడుతూ సరస్వతీబాయి. "నీముక్కుపుడక ఇస్తేచాలు సంతోషిస్తాను" అన్నాడు వృద్ధుడు. అవెంటనే ఎంతో సంతోషించి ఆవిడ తీసి ఇచ్చింది.

## విషపాత్రలో ముక్కుపుడక:

శ్రీనివాసనాయకుని దగ్గరికి పోయి ■ ముక్కుపుడకకు వెలనుకట్టి డబ్బిమ్మన్నాడు. ఆ ముక్కుపుడకను చూచి నాయకుడు ఆశ్చర్యపడ్డాడు. అతడు రత్నపరీక్షా నిపుణుడు. వెంటనే అది తన భార్యముంగర అని గ్రహించాడు. కొంతసేపు ఆగివస్తే డబ్బిస్తానని వృద్ధునితో చెప్పి వెంటనే ఇంటికి వెళ్ళి చూడగా భార్యముక్కున ముంగర

లేదు, ఏమైందని అడిగాడు. భయంతో ఆమె దిక్కు తోచక దైవమందిరంలో ప్రవేశించి విషపానం చేయాలను కొన్నది. ఆ సమయంలో దైవసంకల్పంతో అగిన్నెలోకి ముక్కుపుడక వచ్చిపడింది. పట్టరాని సంతోషంతో ▪ ముంగరను తెచ్చి భర్తకిచ్చింది. అతడు ఆశ్చర్యచకితుడై వెంటనే అంగడికి వెళ్లి భద్రపరచివచ్చిన ముంగరకై వెధికాడు. కనిపించలేదు. మరింతగా ఆశ్చర్యంలో మునిగిపోయి మళ్లీవచ్చి భార్యనడిగాడు. ఆవిడ జరిగిన సంగతంతా పూసగ్రుచ్చినట్లు వివరంగా చెప్పింది. ఇది సామాన్యవిషయం కాదు. దైవఘటన! ఆ వచ్చిన బ్రాహ్మణుడు మామూలు వ్యక్తి కాదు. దైవమే ఆ రూపంలో వచ్చి తనకు కనువిప్పు కలిగించాడని తలంచాడు.

## పరప్పతీబాయి సంతోషించింది:

అతని జ్ఞాననేత్రం విప్పారింది. ఆ బ్రాహ్మణుని కోసం ఊరంతా వెదికాడు. ఎక్కడా కనిపించలేదు. ▪

ముదుసలి బ్రాహ్మణుడు విఠ్ఠలదేవాలయం వైపువెళ్లినట్లు ఎవరోచెప్పారు. అక్కడకు వెళ్లిచూడగా కనపించలేదు, అతని హృదయం డోలాందోళితమైంది. ఆ ముదుసలి ఏమి చెప్పాడని భార్యనడిగాడు. సంపదను పరిత్యజించి, జీవితం దైవసేవకు మీదుకట్టినట్లైతే తాను దర్శనమిస్తా నని చెప్పినట్లు తెలిపింది. వెంటనే భౌతిక సుఖాలకు విముఖుడై తన ఆస్తిపాస్తుల్ని, నగానట్రా, డబ్బుదస్కం సమస్తం బీదలకు పంచిపెట్టి బికారి అయ్యాడు. నిరుపేద తనాన్ని వరించాడు. ఆలుబిడ్డలందరితో కట్టుబట్టలతో బ్రతుక నిశ్చయించుకొన్నాడు. ఇట్లు జరిగినందుకు సర స్వతీబాయి సంతోషానికి మేరలేక పోయింది. తులసీ మాల మెడలో, తంబురా భుజంమీద ధరించి దాసునిగా మారిపోయాడు. ఇంతకు ముందుక్షణం వరకు 'నవకోటి నారాయణుడు' ఇపుడు భగవద్భక్తిలో మునిగిపోయిన దాసుడు.

## విసిరిపారేశాడు :

అనాడు విజయనగర రాజధాని అయిన హంపిలో రాజగురువై ప్రసిద్ధిపొందిన వాడు వ్యాసరాయలు, మధ్వ మత ప్రచారం చేస్తూ ఉండేవాడు. శ్రీనివాసనాయకుడు కుటుంబసమేతంగా హంపికి ప్రయాణమయ్యాడు. అది అరణ్యమార్గం. తమకు తోడు ఎవరూ లేరు. సరస్వతీబాయి భయపడుతున్నట్లు గమనించి "సరస్వతీ భయమెందుకు?" అని అడిగాడు శ్రీనివాసనాయకుడు. "ఇది అడవికదా!" మనం తప్ప ఎవరూ లేరు. దొంగలు పడతారేమో అని భయంగా ఉందండీ!" సమాధానంగా చెప్పింది సరస్వతీ బాయి. "మనం అన్ని సంపదలు వదలుకొన్నాము మన దగ్గరేముంది?"

"మరే........"

"ఆఁ మరే?"

"చిన్న బంగారుపాత్ర ఒకటుందండీ"

"అలాగా! ఏదీ" అని సరస్వతీబాయి వద్ద బట్టలమూట లోంచి ఆ పాత్రను తీసుకొన్నాడు శ్రీనివాసనాయకుడు. ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయింది సరస్వతీబాయి. వెంటనే అరణ్యంలో ఆ బంగారు పాత్రను పారవేశాడు.

"ఆఁ" ఇకభయమేమీ లేదు. నిశ్చింతగా మనం ప్రయాణం సాగించవచ్చు-అన్నాడు శ్రీనివాసనాయకుడు. సరస్వతీబాయి నిశ్చింతగా ఉన్నట్లు నిట్టూర్పు వదిలింది. హాయిగా ప్రయాణంసాగించి హంపి చేరుకొన్నారు.

## [redacted] ముందే తెలుసు :

ఆ ఉదయం వ్యాసరాయల దర్శనానికి వెళ్లాడు శ్రీనివాసనాయకుడు. వ్యాసరాయలు పూజలో ఉన్నాడు. పూజానంతరం భక్తుల గుంపులోఉన్న శ్రీనివాసనాయకు ముద్దేశించి___

"శ్రీనివాసా! ఈ ప్రసాదం పుచ్చుకో" అని వ్యాసరాయలు పిలిచాడు. ఆశ్చర్యపడి తేరుకొని వెళ్లి

వ్యాసరాయల పాదపద్మాలమీద వాలిపోయారు శ్రీని వాసనాయకుడు. "నీవు వస్తావని నాకు ముందే తెలును. చాలా సంతోషం. ఈనాటినుంచి నీవు నా ముఖ్యశిష్యుడవు. 'పురందరవిఠల' అనే ముద్రతో కీర్తనలు రచించి, ప్రజ లలో భక్తిని ప్రచారంచెయ్యి" అని వ్యాసరాయలు చెప్పి, దీక్షనిచ్చి, మధ్వమత సిద్ధాంతాన్ని ఉపదేశించాడు. హరి దాసు జీవితంలో పాటించవలసిన పద్ధతుల్ని వివరించాడు. వ్యాసరాయలు [redacted] దీక్షఇచ్చినది మొదలుకొని శ్రీని వాసునకు పురందరదానన్న పేరు వచ్చింది. పురందర దానుగా ప్రఖ్యాతి పొందాడు. దాసజీవిత మాధుర్యాన్ని రుచిచూశాడు.

## పదరచనతో ప్రఖ్యాతి:

పురందరదాను భక్తి, వైరాగ్యాల్ని వివరిస్తూ నాలుగులక్షల డెబ్బై అయిదు వేల పదాలు రచించాడు. కాని ఈనాడు కొన్నివందల\ పదాలు మాత్రమే లభిస్తు

న్నాయి. ఈ పదరచనతో, పురందరదాసు ఉత్తమ పద కర్తగా ప్రసిద్ధికెక్కాడు. ఇందుకు వ్యాసరాయలే కారణం. ఈ వ్యాసరాయలు శ్రీపాదరాయిలనే గురువువల్ల ఉపదేశం పొందినవాడు. శ్రీపాదరాయలు ఈనాడు కర్ణాటకలోని కోలారుజిల్లా ముల్‌బాగల్‌కు చెందినవాడు. వీరిద్దరు తత్త్వజ్ఞులు, విద్వాంసులు, సాధువులు. బ్రహ్మసూత్రాల ఆధారంతో కన్నడభాషలో పదరచనద్వారా మధ్వాచార్యుని ద్వైతమత ప్రచారం గావించిన మహానుభావులు. వ్యాసరాయలు 'శ్రీకృష్ణ' ముద్రతోను, శ్రీపాదరాయలు 'రంగవిఠ్ఠల' ముద్రతోను పదరచన చేస్తూ వచ్చారు. జ్ఞానధ్యానాలు, జపతపాలు, మంత్ర తంత్రాలు మొదలైన వాటిని వ్యాసరాయలు పురందరదాసు కుపదేశించినాడు. ఆనాడు సంస్కృతభాషలోనే మతచర్చలు జరుగుతూ ఉండేవి. వారికి శ్రుతి, స్మృతుల పాండిత్యమే యెక్కువ. పురందరదాసు కన్నడంలో సామాన్య ప్రజలకోసం పద రచన చేసి ప్రచారం చేయనారంభించాడు.

"దాసరందరే పురందరదాసరయ్య"

ఆ వెనుక రెండురీతుల కూటములు ఏర్పడ్డాయి. వ్యాసకూటమి, దాసకూటమి అని పేర్లు కలిగాయి. దేవుని నామాలు పాడుకుంటూ భిక్షమెత్తుకొని పురందర దాసు సంసారం సాగిస్తూవచ్చాడు. అతని పదాలు ప్రామాణికమై ఒప్పుతున్నాయి. వేదశాస్త్ర, పురాణాల్లోని విద్యావివేకాల్ని, ప్రజ్ఞాపాటవాల్ని తన పదాల్లో ప్రక టించాడు. పురందరదాసు చెప్పినవీ, రచించినవీ అన్నీ గుణంలోనూ, మౌలికతలోను ఉపనిషత్తుల సారానికి తీసిపోలేదు. ఇది సామాన్య ప్రజలకోసం చేసిన ప్రయ త్నం. ఈ పదాలకు అచిరకాలంలోనే 'పురందరోపనిషత్తు' అనే ప్రసిద్ధి వచ్చింది. అందుకే "దాసరందరే పురందర దాసరయ్య" అని గురువు వ్యాసరాయల మెప్పునకు పాత్రుడయ్యాడు.

## ద్వైతం-అద్వైతం-విశిష్టాద్వైతం:

పురందరదాసు భక్తిని గురించి తెలుసుకునే ముందు అంతకు పూర్వం ఆచార్యుల భక్తిమార్గాన్ని గమనించడం అవసరం. మధ్వాచార్యుడు ద్వైతమతాన్ని, రామానుజాచార్యుడు విశిష్టాద్వైతమతాన్ని, శంకరాచార్యుడు అద్వైతమతాన్ని ప్రచారం చేశారు. ద్వైతమతం ప్రకారం ఆత్మ పరమాత్మలు వేర్వేరు; అద్వైతమతం ప్రకారం ఆత్మపరమాత్మలు ఒకటే; విశిష్టాద్వైతమతం ప్రకారం ఆత్మపరమాత్మలు వేరైనా చివరకి ఆత్మలు పరమాత్మలో కలసిపోయి ఒకటి అవుతాయి. ఇక్కడ మరో విషయం మనం గుర్తుంచుకోవడం అవసరం. ద్వైతులకు, విశిష్టాద్వైతులకు ఇష్ట దేవత విష్ణువు. అంటే హరి సర్వోత్తముడు. అతడే అధికారి. భక్తులు దాసులు. కాని ఇందులో భేదముంది. విశిష్టాద్వైతం ప్రకారం భక్తుడు భగవంతునికి భక్తితో తన్ను నివేదించుకొంటే దేవుడు అనుగ్రహించి ఉద్ధరిస్తాడు, అంతట పరమాత్మలో ఆత్మ సంలీనం చెందుతుంది. కాని ద్వైతమతం

ప్రకారం జీవాత్మ పరమాత్మలు ఎపుడూ వేర్వేరే భువిలో వేర్వేరు అయినట్లే దివిలోనూ వేర్వేరే. ఇక్కడ కర్మ ... వత్తరమైంది. దీనికి వైరాగ్యమే మార్గనిర్దేశక మవుతుంది. జ్ఞానవంతుడై తెలుసుకోవలసి ఉంటుంది. భక్తి వివేకాలు చెట్టపట్టాలు పట్టుకొని నడవవలసి ఉంటుంది. ఈ భక్తివల్ల ముక్తిని పొందవలసిఉంది.

## నవవిధభక్తులు :

ఈ భక్తి - శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం అని తొమ్మిది విధాలు. వీటిలో మళ్లీ ప్రధానంగా మధుర, వాత్సల్య, సఖ్య, సేవ్య, శాంతమనే ఐదు పరమభావా లున్నాయి. ఇవి రసస్థితిని పొందినట్లు అలంకారికులు అంగీకరించారు, వీటినన్నిటిని మధ్వాచార్యులనుంచి గ్రహించినవారు శ్రీపాదరాయలు, వ్యాసరాయలు. వ్యాస రాయలనుంచి సమగ్రంగా గ్రహించాడు పురందరదాసు.

## మధురభక్తి :

ఈతని పదాల్లో నవవిధభక్తులు, ఐదు పరమ భావాలు ఉన్నాయి. రాధాకృష్ణులు అంటే గోపికృష్ణుల భాగవతభక్తి పురందరదాసు పదాల్లో కనిపిస్తుంది. అంటే మధురభక్తి స్పష్టంగా ఉందని భావం. ఇంకా బాలకృష్ణుడు వెన్నను దొంగిలించడం, గోపికలు యశోదతో మొరపెట్టు కోవడం, గోపికలతో విహరించడం మొదలైన శ్రీకృష్ణ లీలలను పురందరదాసు ఎంతో చక్కగా వర్ణించి తరిం చాడు. ఇలాగే భక్తి, జ్ఞానం, నీతి, వైరాగ్యం మొదలైన మార్గాల్ని సులభరీతిలో అందరికి అర్థమయ్యేట్టు వివరించాడు.

## హరినామస్మరణ చేయండి :

హరి సర్వోత్తముడు. ఆత్మనివేదనంతో కూడిన భక్తి ముఖ్యం. ముక్తికి భక్తి మూలం. భక్తి లేని ఆడంబరాలు అన వసరమని పురందరదాసు విశ్వాసం. ఈ కలియుగంలో

హరిని స్మరిస్తేచాలు ముక్తి కలుగుతుంది. కాబట్టి ఓమనసా! హరినామస్మరణం చేసి తరించుమంటాడు. ఇంకా దృఢ మైనభక్తి ప్రధానంగాని, స్నాన, జప, తపాదులతో పని లేదంటాడు పురందరదాసు. భక్తితోపాటు మానవుడు జ్ఞానం సంపాదించాలనీ బోధించాడు. పురందరదాసు జీవితతత్వం తెలిసిన వాడు. అనాడు ఆచారాలపేర జరిగే అనాచారాల్ని ఖండించి నీతిని బోధించాడు. వైరాగ్యాన్ని వివరించాడు. ఇవన్నీ పురందరదాసు పదాల్లో మనం స్పష్టంగా చూడవచ్చు.

## ప్రతికడావికే తిండి:

తాను స్వీకరించిన దాసవృత్తివల్ల పలుకష్టాల్ని ఎదుర్కోవలసివచ్చింది. అయితే శ్రీకృష్ణుని అనుగ్రహంతో వాటిని సంతోషంతోనే ఎదుర్కొన్నాడు. ఆకష్టాలు కష్టా లనిపించలేదు. పైపెచ్చు దేశకాల పరిస్థితులకు సంబంధిం చిన అడ్డంకులన్నీ తొలగిపోయి శ్రీకృష్ణుని సన్నిహితత్వం

ఏర్పడి, సౌఖ్యం లభించింది. అతనిలోని అహంకారం నశించిపోయింది. అచిరకాలంలోనే అనుకున్నదానికంటే ఎక్కువగా జీవితానికి శాంతి లభించింది. ఇలాంటి పురందరదాసు జీవితంలో ఎన్నో విశేషాలు, మహిమలు నడిచినట్లు ప్రతీతి ఉంది. ధనధాన్యాలు ముఖ్యం కాదు. భగవద్భక్తి ప్రధానం. బ్రతకటానికి మాత్రమే ఆహారం అవసరం. అంతకుమించి అక్కరలేదు-అనే విషయాన్ని తన జీవితమే సాక్షిగా నిరూపించినవాడు పురందరదాసు. తాను నమ్మిన సిద్ధాంతాల్ని సామాన్య ప్రజలలో అది పాడుకోడానికి వీలుగా ప్రజలభాషలో ప్రచారంచేసి, సమాజాన్ని ఉత్తేజపరచిన మహానుభావుడు. మానవుల జీవితాల నుద్ధరించిన శిక్షా గేసరుడు.

## ఎలా ఆతిథ్యమివ్వాలి?

విజయనగరంలో హరిదాసుగా జీవితం గడుపుతున్న రోజులలో ఒక సంఘటన జరిగింది. సర్వమూ

త్యాగం చేసిన పురందరదాసు చిరుతలు, తంబూర, గజ్జెలు ధరించి పదాలు పాడుకొంటూ, ప్రజల్ని ప్రభోధిస్తూ సంతో నంతో పాటు వీధివీధి తిరిగేవారు. వచ్చిన భిక్షతో సంసారం సాగిస్తూ ఉండేవారు. ఒకనాడు ఒక బంధువు చుట్టపుచూపుగా ఇంటికి వచ్చాడు. అప్పటికి భజననుంచి ఇంకా పురందరదాసు ఇంటికి తిరిగిరాలేదు. వచ్చిన బంధువునకు తగిన రీతిలో అతిథిమర్యాదలు చేయుటానికి ఇంట్లో అన్నీ నిండుకున్నాయి. చాల బాధపడింది సరస్వతీ బాయి. వెంటనే పక్కింటి షైలారప్ప భార్యనడిగి సరి వేదిని తెచ్చి బంగారు తయారుచేసి, దాన్ని అమ్మి అదట్టితో బంధువునకు తగినరీతిలో విందు ఏర్పాట్లు చేసింది. ఇంతలో పురందరదాసు వచ్చి విషయం తెలుసుకొన్నారు. నీ మాత్రం ఆలస్యం చేయకుండా తయారవుతున్న వంటల్ని పరుసవేదిని పుష్కరిణిలో పారవేయించాడట. భిక్షుక వృత్తితో గడుపుతున్న తమతో సమంగా పాలుపంచుకోగల వారికి మాత్రమే ఆతిథ్యముంటుందనీ, రాజమర్యాదలకు

తమ ఇంట అవకాశం లేదని చెప్పాడు. వచ్చిన బంధువు నిందిస్తూ వెళ్లిపోయాడు. సరస్వతీబాయి మొదట వ్యథ చెందింది, దీనికితోడు మైలారప్పభార్య [illegible] పరుసవేది గావాలని వేధించింది.

## మైలారప్ప దాసుగా మారిపోయాడు :

పురందరదాసు ఆజ్ఞతో వెంటనే కుమారుడు మధ్య పలి పుష్కరిణిలో దూకి [illegible] బదులు నాలుగు పరుస వేదులు తెచ్చి ఇచ్చాడు. సంతోషంతో వెళ్లింది మైలా రప్పభార్య. కానీ పురందరదాసు బోధనలవల్ల ఇది మంచిది కాదని తెలుసుకొని, జ్ఞానోదయం పొందిన మైలారప్ప "క్షమించ" మని కాళ్ళపైబడి వేడుకొన్నారు. "పురందర విఠ్ఠలుడే నిన్ను రక్షిస్తాడు" అన్నాడు దాసు. "అదృష్ట వంతుణ్ణి" అనిచెప్పి వెంటనే పరుసవేదిని, సంపదల్ని వదలి పెట్టి నిరుపేదగా, భక్తుడుగా, దాసుగా మారిపోయాడు. ఇలాగే ఎందరినో భక్తులుగా మార్చిన మహానుభావుడు పురందరదాసు.

## దారిద్ర్యాన్ని వరించాడు :

పురందరదాసు గురువైన వ్యాసరాయలు శ్రీకృష్ణ దేవరాయలకు రాజగురువు. హంపిని రాజధానిగా చేసు కొని విజయనగర రాజ్యమేలిన ప్రముఖుడు శ్రీకృష్ణదేవ రాయలు. రాయలు ఏల్బడిలో విజయనగర సామ్రా జ్యం మహావైభవంగా వెలసింది. ఒకానొక సమయంలో 'కుహూయోగం' అనే గండంనుంచి కృష్ణదేవరాయలను కాపాడిన మహానుభావుడు వ్యాసరాయలు. ఆగండం సమయంలో రాజుకుబదులు వ్యాసరాయలు సింహాసనం అధిష్ఠించి, ఆదోషం రాజుకు తగులనీక రక్షించినవాడు. ఈ వ్యాసరాయలకు అగ్రహారాలు, మడులు మాన్యాలిచ్చి రాయలు గౌరవించాడు. అదే రీతిని రాయలు పురందర దాసు నిరాడంబరతని మెచ్చుకొని, అతని ఆత్మనివేద నను గుర్తించి ధనధాన్యాల్ని, కానుకల్ని ఇచ్చి సత్కరిం చాడు. సర్వసంపదల్ని బీదలకు పంచిపెట్టి దారిద్ర్యాన్ని వరించిన మహాయోగి పురందరదాసు, కాబట్టి రాయ

లిచ్చిన కానుకలమీద మోహంలేని పురందరదాసు వాటిని నిరుపేదలకు పంచిపెట్టాడు.

## నీ భాగ్యం గొప్పదా? నా భాగ్యం గొప్పదా?

ఇందుకు కారణం [redacted] రాయలు పురందర దాసును ఒకానొక సమయంలో రాజాస్థానానికి ఆహ్వానించాడు. తానిచ్చిన కానుకలు బహుశ పురందరదాసుకు సంతృప్తినివ్వలేదేమో అందుకే పంచిపెట్టాడు కాబోలు అన్న సందేహాన్ని రాయలు వెలిబుచ్చాడట. సర్వసంపదలతో "నవకోటి నారాయణ" బిరుదు వహించిన తాను, వాటిని వదలి నిరుపేదగా మారడంలోని అంతర్యాన్ని రాయలకు వివరించి తన ఔన్నత్యాన్ని తెలిపాడు. వాస్తవానికి భౌతికసంపదలు గలిగిన రాయలకంటే ఆధ్యాత్మిక సంపన్నుడైన తానే గొప్పవాణ్ణని "నీ భాగ్యం గొప్పదో నా భాగ్యం గొప్పదో పరిమానుకొందాం రండి" అనే అర్థం వచ్చేట్టు రాయలతో సవాలు చేస్తున్నట్లు పదరచన చేసి

పాడి వినిపించాడు. ఈ పదం విని అమితానందం పొందిన కృష్ణదేవరాయలు పురందరదాసుని పురందరుని అపరావతారంగానే భావించి సత్కరించాడు.

## వారిద్దరికే తెలుసు :

ఈ పై సంఘటనలు పురందరదాసుకు సంపదలపై వ్యామోహం లేదని తెలుపుతున్నాయి. ఇదేరీతిని భగ [redacted] తన దాసునిగా చేసుకొన్న సంఘటనలు కొన్ని ఆయన జీవితంలో లేకపోలేదు. [redacted] పర్యాయాలు వ్యాసరాయలతోపాటు [redacted] వస్తూ పోతూ ఉండేవాడు పురందరదాసు. ఇంతకుముందే తెలుసుకొన్నట్లు ఇతడు తిరుపతిలో సంకీర్తనాచార్యుడుగా ప్రసిద్ధిపొందిన అన్నమాచార్యుని సందర్శించి శ్రీవేంకటేశ్వరునిగా భావించి కీర్తించాడట. అదేరీతిని అన్నమాచార్యుడు సైతం పురందరదాసును పురందరవిఠ్ఠలుని అపరావతారంగా తలంచి ప్రస్తుతించాడట. సామాన్యులకు [redacted] పోయినా

ఆ మహానుభావులకు మాత్రమే పరమ్పర సహాయము గోచరించాయని మనం గ్రహించవలసి ఉంది.

## భగవంతుడే వడ్డన చేశాడు :

కృష్ణదేవరాయలు గురువు వ్యాసరాయలతోపాటు అనేక పర్యాయాలు తిరుపతికి వచ్చి శ్రీవేంకటేశ్వరుని కైంకర్యం చేయించి వెళ్లుతూ ఉండేవాడు. ఒక సందర్భంలో వీరితోపాటు పురందరదాసు సైతం తిరుపతికి వచ్చాడు. భిక్షమెత్తి వచ్చిన సంభారాలతో బీదలకు అన్నదానం చేస్తున్నాడు పురందరదాసు. అపుడు పంక్తికి పూర్తిగా వడ్డించడానికి తగినంత నేయి లేకపోయింది. వెంటనే పురందరదాసు నేయి తెమ్మని తన శిష్యుడు అప్పణ్ణను ఆజ్ఞాపించాడు. పనిఒత్తిడిలో అప్పణ్ణ వినిపించుకో లేదు. నేయి తీసుకురావటానికి వెళ్ళనూ లేదు. కానీ ఎవరో అప్పణ్ణలాంటి మరోవ్యక్తి నేయి తెచ్చి ఇచ్చాడు. పంక్తికి పూర్తిగా నెయ్యివడ్డన జరిగింది. పురందరదాసు తరువాత

[illegible] విషయం తెలుసుకొన్నాడు. తన దైవమే తనకు దాసుడై సేవ చేసినట్లు గ్రహించి అత్యంతానందం పొందాడు. క్షమించమని పురందరవిట్ఠలుని వేడుకొన్నాడు. అంటే భగవంతుడే అప్పణ్ణ వేషంలో వచ్చి నేయి తెచ్చియిచ్చి కొరవతీర్చాడు. భగవంతునితో ఊడిగం చేయించుకొన్న భక్తాగ్రేసరుడు పురందరదాసు.

## దెబ్బతిన్న విఠలుడు :

ఇలాంటి సంఘటన మరొకటి ఉంది. అది మరింత ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. పండరీపురంలో పురందరవిట్ఠలుని సేవలో పురందదాసు నిమగ్నుడై ఉన్నరోజులవి. రాత్రి సమయం. బాగా దాహమేస్తుండగా పురందరదాసు నీళ్లు తెమ్మని అప్పణ్ణను పిలిచాడట. నిద్రమత్తులో ఉన్న అప్పణ్ణ వినిపించుకోలేదు. వెంటనే నీళ్ళుతెచ్చి ఇవ్వలేదు. [illegible] కొంతసేపటికి శిష్యుడు నీళ్ళు తెచ్చియిచ్చాడు. నిజంగా అప్పణ్ణ అనుకొని ఆలస్యంగా వచ్చినందుకు [illegible] తలపై పురందరదాసు ఒక దెబ్బ కొట్టాడట. [illegible] దెబ్బతిని వెళ్లి

పోయాడు. గురువు నిద్రపోయారు. మరునాటి రోజు ఉదయమే పురందరవిట్ఠలస్వామి విగ్రహం తల ఉబ్బి వాచిపోయి ఉన్నట్లు అర్చకులు గ్రహించారు. కన్నీరు ఏకధారగా ప్రవహిస్తూంది. అర్చకులు ఎంత ప్రయత్నించినా వాపు తగ్గలేదు. కన్నీరు ఆగలేదు. ఈ విషయం తెలిసి పురందరదాసు వెంటనే గర్భాలయంలో ప్రవేశించాడు. ఆవిచిత్రం గమనించాడు. విషయం గ్రహించాడు. రాత్రి తాను కొట్టింది తన శిష్యుడు అప్పణ్ణని కాదనీ, శిష్య వేషంలో వచ్చిన తన దైవం పురందరవిట్ఠలుడనే తెలుసుకొన్నారు. అందుకు మిక్కిలి బాధపడ్డాడు. క్షమించమని విట్ఠలస్వామిని వేడుకొన్నారు. పురందరదాసు భక్తికి మెచ్చుకొని స్వామి అనుగ్రహించాడు. ఆ వెనుక స్వామితలమీద వాపు తగ్గిపోయింది. కన్నీరు ఆగిపోయింది. ఈ విచిత్ర సన్నివేశాన్ని గమనించిన భక్తులు పురందరదాసు భక్తికి అచ్చెరువు పొందారు. వేనోళ్ల ప్రశంసించారు.

## ఆతవికేమీ తెలియదు వదిలిపెట్టండి !

ఇంతకంటే మరీ విచిత్రమైన సంఘటన [illegible] ఉంది. ఒకసారి పురందర విట్ఠలస్వామి బంగారుకెడియం [illegible] మాయమైంది. అర్చకులు వెదకి వెదకి వేసారి పోయారు. కానీ కడియం మాత్రం లభించలేదు. చివరకి ఆనగరిలోని ప్రసిద్ధ వేశ్య చేతిలో ఉండగా చూశారు. ఆ వేశ్య విట్ఠలస్వామి పూజచేయించడానికి వచ్చింది. చూసిన అర్చకులు ఆకడియమెక్కడిదని ప్రశ్నించారు. తనదేనని సమాధానం చెప్పింది ఆ వేశ్య. స్వామివారి చేతికడియంతో పోల్చి చూడగా రెండూ సమంగా ఉన్నాయి. అది స్వామి చేతిలోని కడియమేనని నీకెలావచ్చిందని ప్రధానార్చకుడు గద్దించి అడిగాడు. తనదేనని నిశ్చలంగా చెప్పింది వేశ్య. "నీవు స్వామిచేతి కడియం దొంగిలించావు" అన్నారు ప్రధానార్చకుడు.

"లేదు! నేను దొంగిలించలేదు, ఇది నా సొంతం" అని ఆమె నిర్భయంగా సమాధానం చెప్పింది.

"కరియం దొంగిలించడమేగాక, బుకాయిస్తావా? ఇందుకు శిక్షవేస్తా" నన్నాడు కోపంతో ప్రధానార్చకుడు.

"చేయని తప్పుకు శిక్ష ఏమిటి?" మరింత రెట్టించి ప్రశ్నించింది వేశ్య.

విపరీతకోపంతో ఆమెను దేవాలయస్తంభానికి కట్టించి కొరడాతో కొట్టమని ఆజ్ఞాపించాడు ప్రధానార్చకుడు.

ఆదెబ్బలు భరించలేని ఆవేశ్య, గతరాత్రి పురందర దాసు తన యింటికి వచ్చి ఇచ్చినట్లు చెప్పింది. ఆ అర్చకులు నమ్మలేక పోయారు. అంతటి భక్తాగ్రేసరుడు వేశ్య యింటికి వెళ్లాడా? అన్నది నమ్మశక్యంగాని సంగతి. అయినా వెంటనే పురందరదాసును పిలిపించి ఈ విషయం అడిగారు. అశ్చెరువు పొందిన అతడు తనకేమీ తెలియదని సమాధానం చెప్పాడు. అదే స్తంభానికి పురందర

దాసుని కట్టించి కొరడాతో కొట్టించారు అధికారులు. పురందరదాసు ఎంతకొట్టినా సంతోషంతో భరించాడట. ఇది విట్ఠలస్వామి చేసిన చమత్కారమని పురందరదాసు గ్రహించాడు. అంతే [illegible] వేషంలో స్వామి వేశ్యయింటికి వెళ్లి బంగారు కడియం ఇచ్చి వచ్చాడని తెలుసుకొన్నాడు. కొరడాదెబ్బలు పడుతూనే ఉన్నాయి. అంతలో గర్భాలయంలోనుంచి "దాసు కేమీ తెలియదు. అతన్ని వదలిపెట్టండి" అన్నమాటలు వినిపించాయట. ఆ వెంటనే అతన్ని బంధవిముక్తుని గావించి క్షమాపణ వేడుకొన్నారు అధికారులు. సంతోషంతో వారిని క్షమించాడు పురంద దాస. ఆనాడు తన శిష్యుని వేషంలో వచ్చిన విట్ఠల స్వామిని పురందరదాసు కొట్టినందుకు తననీవిధంగా కొట్టించాడని ఇతడు తెలుసుకొన్నాడు. ఇదంతా దేవుడి మహిమ అనీ, ముయ్యికి ముయ్యి తీర్చుకొన్నాడంటూ [illegible] పల్లవితో పురందరదాసు పదం పాడుకొన్నాడు.

ఇలాగ పురందరదాసు జీవితంలో ఎన్నో మహిమలు, విశేషాలు జరిగాయి. భగవంతుని తనదాసుని గావించుకొన్న మహానుభావుడు పురందరదాసు.

## అందరు ప్రభావితులైన వారు :

పురందరదాసు కర్ణాటక సంగీతానికి చేసిన సేవ మిక్కిలి విలువైంది. అతడు సుమారు 70, 80 రాగాలు వాడినట్లు అతని పదాలవల్ల తెలిసే విషయం. తన పదాల్లో ధాతుమాతువులు అంటే సంగీతసాహిత్యాలు రెండూ సులభమై, సరళమై ఉండేలాగున రచన చేశాడు. తాళరీతులన్నిటిని అతడు గ్రహించాడు. ఇతడు సంగీత శిక్షణను సులభతరం చేశాడు. సంగీతం నేర్చుకునే వారికి క్రమరీతిని నేర్పడానికి తగినట్లు రచించాడు. అదే పద్ధతిలోనే కర్ణాటక సంగీతం నేర్పడం ఆనవాయితీ. పురందరదాసు తరువాత వెలసిన వాగ్గేయకారులందరూ ఈతనివల్ల ప్రభావితులైనవారే.

III

పురందరదాసు కన్నడభాషలో ఎంతో మనోహరంగా పదరచన చేసిన వాగ్గేయకారుడు. కొన్ని ఉదాహరణలని మనం చవిచూద్దాం.

## చూశారా శ్రీవేంకటేశ్వరుని!

"దణియనోడిదెన్ వేంకటన-మన
దణియనోడిదె శిఖామణి తిరుమలన ॥దణియ॥
చరణదందిగె గెజ్జెయవన-పీతాం
బర ఉడిగె ఒడ్యాణవిట్ట హను
మెరెయువ మాణిక్యదవన-చిన్న
సరహార పదక కౌస్తుభ ధరిసిదన ॥దణియ॥

[ చూశారా ధనవంతుడైన వేంకటేశ్వరుని
చూశారా ధనవంతుడైన తిరుమల శిఖామణిని
కాళ్ళలో గజ్జెలందియలు గలవానిని
పీతాంబరంపైని ఒడ్డాణం పెట్టినవానిని

మిక్కిలి మెరుస్తూన్న మాణిక్యం గలవానిని
బంగారు హారమూ, పతకము, కౌస్తుభమువానిని ]

ఇందులో శ్రీ వేంకటేశ్వరుని [redacted] కట్టినట్లు వర్ణించేతీరు స్పష్టం.

**తుమ్మచెట్టులాంటివాళ్లు :**

“జాలియ మరవంతె-ధరయొళు దుర్జనరు
జాలియ మరవంతె ॥ జాలి ॥
మూలాగ్ర పరియంత ముళ్ళకూడిప్పంథె
బిసబలి బళలి బందవరిగె నెరళిల్ల
హసిదు బందవరిగె హణ్ణూ ఇల్ల
కుసుమవాసనె ఇల్ల కూడ్రలు స్థలవిల్ల
రసదల్లి స్వాదవు విషదంతె ఇరుతిహ ॥ జా.లి ॥

[ భూమిపై దుర్జనులు తుమ్మచెట్టులాంటివాళ్లు.
కిందనుంచి పైదాకా తుమ్మముళ్ళు
ఎండలో బడలిక చెందివచ్చిన వారికి నీడా లేదు.

ఆకలిగొని వచ్చినవారికి పళ్లూ లేవు.
ఇంక పూలంటారా? వాసన లేనివి.
కూర్చోటానికి స్థలమూ లేదు.
కాయలరసం విషంలా కటువుగా ఉంటుంది.]

ఇందులో దుర్మార్గుని తుమ్మచెట్టుతో పోల్చి చెప్పడం జరిగింది.

[శ్రీకాంతుని భజించు!

"దంతగళు సడలిదవు ధాతుగళు కుందిదవు
కాంతె యరు జరెదు ఒకరినువరో
చింతె యన్నేతకె బయలాద దేహక్కె
ఇంతెందు శ్రీకాంతన నెనెమనవె"

[పండ్లు సడలిపోయాయి.
ధాతువుల పటుత్వం తగ్గిపోయింది.
స్త్రీలు ముసలితనాన్ని అసహ్యించుకొంటున్నారు.

శుష్కించిన దేహానికి చింతయేల?
ఓ మనసా! ఇది తెలిసి శ్రీకాంతుని భజించు.]

ఇందులో స్వభావోక్తిలో ఎంతో సహజసుందరంగా ముసలితనాన్ని వైరాగ్యరీతిలో వర్ణించాడు.

## పురందరదాసమండపం:

ఇలాగ సహజరీతిని పదరచనచేసి మానవకోటిని ప్రబోధిస్తూ ఎక్కువ కాలం హంపిలోనూ, పురందరపురం లోనూ, నివసించిన పురందరదాసు గురువాజ్ఞతో అనేక తీర్థయాత్రలు చేశాడు. అతడు సందర్శించిన వాటిలో తిరుపతి, అహోబిళం, కంచి, బేలూరు ముఖ్యంగా పేర్కొన దగ్గ క్షేత్రాలు. ఆయా క్షేత్రాలు సందర్శించినపుడు ఆయా దేవతల ఉపముద్రలతో అనేక పదాలు రచించాడు, అన్నిటి లోకి తిరుపతినే ఎక్కువసార్లు సందర్శించినట్లు అతని పదాలు సాక్ష్యమిస్తున్నాయి. పైగా కృష్ణదేవరాయలు ఆయనకు తిరుపతిలో ఒక మండపం కట్టించి యిచ్చినట్లు

ప్రతీతి ఉంది. అందులోనే పురందరదాసు తన పూజా కార్యక్రమాన్ని కొనసాగిస్తూ ఉండేవాడు.

కీర్తనపద్ధతిని ఉద్ధరించిన మహానుభావుడు పురందర దాసు. కర్ణాటక సంగీతసాహిత్యాలను సముద్ధరించిన మహనీయుడు. కర్ణాటక సంగీతానికి చక్కటి రాచబాటలు వేసి తరువాత వాగ్గేయకారులకు ఎందరికో మార్గదర్శకు డయ్యాడు. అందువల్లే "కర్ణాటకసంగీత పితామహ" బిరుదు చేత ప్రసిద్ధికెక్కాడు.

పరమతసహనం :

మతవైషమ్యాన్ని తొలగించి సామరస్యాన్ని గూర్చిన మహాపురుషుడు పురందరదాసు. కులమతవర్ణ వర్గ విభేదాల్ని నిరసించాడు. పరమతసహనం అతనిలోని గొప్పగుణం. తాను మధ్వాచార్యుని ద్వైతమతాన్ని స్వీక రించినా విశిష్టాద్వైత, అద్వైతమతాల వారితో విరోధించ లేదు. శైవులతో సహితం సహనంతో వ్యవహరించిన

సహనశీలి. హరిజనులను ఎంతో ప్రేమతో చూసిన మహనీయుడు. జన్మతః హరిజనులైన వారికంటే కర్మతః పంచములైన వారే నీచులని అతని భావన.

మానవజీవితాల్ని సముద్ధరించిన మహామహిాత్ముడు పురందరదాసు. ఎల్లప్పుడు అందరికీ వందనీయుడు, చరితార్థుడు పురందరదాసు!

